శ్రీలేఖ సాహిత్య ప్రచురణ



# నిరంతరం

డా॥ టి. శ్రీరంగస్వామి

# నిరంతరం

(కవితా సంపుటి)




టి. శ్రీరంగస్వామి

శ్రీలేఖ సాహితి

వరంగల్లు

1996

# NIRANTARAM

## Poems by

**Dr.T. Sriranga Swamy**

Ugadi (20-3-96)

**Price : Rs. 10/-**

**For Copies :**

**Srilekha Sahithi**
5-11-481, Vidyaranyapuri,
Warangal - 506009

**Vishalandhra Book House Branches**

*Composed & Printed by*

Shanthi Printing Press, Hanamkonda, Ph: 79541

ఈ కవితలను పరిశీలించిన
ఆచార్య కోవెల సంపత్కుమార్‌గారికి
పాపినేని శివశంకర్‌గారికి
ప్రచురించిన
పత్రికలకూ
ప్రసారం చేసిన
ఆకాశవాణి, వరంగల్ వారికి
నా కవితా వ్యాసంగంలో సహకరిస్తున్న
మిత్రులకు
ఈ సంపుటి వెలుగు చూడడానికి కారకుడైన
నరసింహా రెడ్డికి
కృతజ్ఞతలు

# సాదృశ్య శకలాలు

నలభై ఏండ్ల వయసులో
నన్నూర్లుగా తిరిగే సాదృశ్యశకలాలు ఎన్నెన్నో ........
కలగా వచ్చి
స్మృతిగా వచ్చి
హైమాచలరేఖలై
కన్నుల కాంతివీచికలై
హృదయాన్ని ఆవరిస్తూ...............
క్రమక్రమానుగతియై
ఒక్కో మలుపు
ఒక్కో అవ్యక్తానుభూతి.
మూల మూలాలుగా కదిలిస్తూ....విదిలిస్తూ
ఒక్కో శకలం ఒక స్పందనను కలిగిస్తున్నది.
శకలం-శకలం వెనుక ఒక్కో గాథ - సృజన,
తీపి ....చేదుల అనుభవాలు
జీవన గమనానుభవంలోని
వేదనామృతం గ్రోలుతూ
శకలానుభవాలను ఆరగించుతూ
ప్రయాణాన్ని సాగిస్తున్నాను.
హైస్కూలు చదువు చివరకు వచ్చేసరికి
హై స్పీడులో ఒడుదొడుకులు ఎదుర్కొని

కాలేజి చదువుల ప్రహసనంలో
వృత్తి విద్యకో, చెత్త విద్యకో రాజీపడుతూ
ఆర్థిక, సామాజిక సమస్యలకు
రాటుదేలి, తలవంచి
దొరికిన దానితో సంతృప్తిపడి, చదివి చదివి
ఉద్యోగాన్వేషణలో ....వేట ప్రారంభించి
చదువుకు సరిపడని ఉద్యోగానికి రాజీపడి
జీవనపోరాటాన్ని ఆరంభించి
రాట్నంలో కండె అయి
కండె కండెకూ
నూలుపోగులాసాగుతూ
ఒక్కో పోగుకు
ఇంకో పోగును అతుకువేసుకుంటూ......
సాగే జీవనశకలమిది.
ఇక్కడనో.............
ఇక్కడికి ముందేనో.........
పెద్దలపోరుకో.........
వయసుతెచ్చే మార్పులకో.........
ప్రాపంచిక వాగ్బాణాలకు తలఒదిగో.........
ఏకాన్ని, ద్వయంగానో.........
పాడ్యమి నుండి విదియకు
ఆ తర్వాత షష్టి విభక్తులకు కాకుండా

చతుర్థీ విభక్తి వరకు మొత్తంగా ప్రయాణించి
చతుర్థీ విభక్తులతోపాటుగా.........
మూలకుటుంబంలోని సాధకబాధకాలకు
పడుతూలేస్తూ ప్రయాణంసాగించడం ఒక కళ
అక్కడపొందే బతుకు ఆటుపోట్లలో
జీవనవేదంలో వేదాలను పఠిస్తూ
అందులోని ఉచ్ఛారణ దోషాలను సవరించుకుంటూ
ఉల్లేఖనాలంకారాలను సర్దుకుంటూ సాగడం
జీవన పోరాటాలలోని శకలాల అందం.
ఆ అందం బాహ్యాడంబరాలకు ప్రతీక.
హృదయాంచలాల్లో ఓ కమనీయ కావ్యంగా
పరిమళిస్తూ సాగుతుండడం ఒక వైపు.........
ఉద్యోగ పర్వంలో.........
ఏ మెట్టు ఎక్కడ ఎక్కాలో.........
ఏ దేభ్యం వచ్చినా సర్దుకొని వెళ్ళడం నేర్చుకొని
ఏ ఎండకు ఆ గొడుగు పడుతూ
వెనుకబడ్డ విద్యార్జనలో ముందుకెళ్ళడానికి
వెంపర్లాడుతూ చేసే ప్రయత్నాలను
వెక్కిరిస్తుండే కొక్కిరాయుళ్ళ
వెకవెకలకు, బకబకల ఆలోచనల
వెకిలి చేష్టల.........
శకలాల పోటులకు తావివ్వకుండా

పట్టాలు అందుకున్నప్పుడు పొందే ఆనందం
ఒక ఉద్వేగ భరితమైన హృదయ సంజాతం
మోదుగు పువ్వులోని కెంపునైవెలుగుతాను.
కార్యాలయంలో.........
"కాకాలే" సమస్తమైన
వ్యాఘ్రాల గోముఖాల మధ్య
జీవితం సాగించడమే ఈ నాటి కళ.
ప్రతి జీవితం వెనక నిత్య శకలాలుకాక
ఇంకొక శకలం ఉంటుంది.
ఆ శకలం స్పందన ఏరూపమైనా
ఆ శకలం అసలు జీవన ధార.
ఆ జీవనధారలోనే నిత్య స్ఫూర్తి.
నిజమైన జీవనరాగాన్ని ధ్వనిస్తూ
నిక్కచ్చిగా ప్రయాణించేందుకు
మిట్ట పల్లాలను దాటేందుకు ఓ ఊపు
హిమాలయోన్నతులను కూడా అధిగమించే
హిమజ్వాలా మాలికలు
స్ఫటికం లాంటి స్వచ్ఛ ధవళకాంతి
స్పందనతో నిత్యమూ రాజుకుంటుంది
ఆ శకలం 'ఊహ, ఊపు' మరోజన్మ వరకు
ప్రయాణం చేస్తుంది.
జీవన ప్రయాణం ఒక్క శకలంతో

మాత్రమే పూర్తికాదు.

ప్రతి జీవన రథం ఎన్నో శకలాల మధ్య

సాదృశ్య శకలాలను

అవగతం చేసుకుంటూ

భావాభావాన్ని అసంపూర్ణంగానో

స్పందనాస్పందనల అసంతృప్తిగానో

మనస్ అమనస్సుగానో

ఈ సాదృశ్య శకలాలతో

అందబోయే శకలాలమధ్య

జీవసంపుటిని సాగించడానికి

ఆపేక్షలు -పైరగాలి అయినప్పుడు

పొన్న చెట్టు నుండి కురిసే పూలు

ఏరుకుందాము రండి

మనస్సులో మల్లెలసువాసనలు

ఆహ్వానిద్దాం రండి

వాకిట్లో గులాబీలు

పరచుకుందాం రండి

మోదుగు పూలను సంకేతంగా తీసుకొని

జీవన శకలాలతో ఒంటరిగానైనా పోరాడుదాం రండి.

*2-4-93*

*AIR WARANGAL, 12-6-95*

# జ్ఞాపకం ఒక తపస్సు

జ్ఞాపకాల వీధుల్లో
మనస్సెప్పుడూ ఊరేగుతుంటుంది.
మనస్సునెంత అదుపులో పెట్టినా
చాంచల్యం తప్పడం లేదు.
అనిపిస్తుందప్పుడు
చపలత్వం మనస్సుకా..............! నాకా..............!
అయినా అది మనసేనో..............
..............హృదయమేనో..............
దృశ్యా దృశ్యంగా.... గత స్మృతులు
గాజు పొరల్లోని బింబాల్లా
ఉల్లిపొర కాగితం కింది చిత్రంగా
ఆషాఢ మాసపు మబ్బుల్లాగా
హిమాంచలాంచలాల తొలి పొద్దులోని
పొగమంచుల్లాగా
జ్ఞాపకాలు నన్ను చుట్టు ముట్టుతూనే ఉన్నాయి
జ్ఞాపకం ఒక్కోసారి మనల్ని రాగరంజితం చేసి
గానగంధర్వులను చేసినా
జ్ఞాపకం ఒక్కోసారి మనల్ని దహించి అరణ్యాల
పాలు చేస్తుంది
అందుకే..............

జ్ఞాపకం ఒక చలివేంద్రం–

జ్ఞాపకం ఒక లావా–

జీవనారణ్యంలో

జ్ఞాపకాల తాళపత్రాలను

మేధలో పదిలం చేసుకుంటూ

మనుగడను సాగిస్తుంటాను.

జ్ఞాపకాల ఆటుపోటుల్లో

ఒక ఋషినై మసలుతుంటాను

సర్వాంగాలనూ కేంద్రీకరించి

జ్ఞాపకాల ఒడిలో విశ్రమించకుండా

జ్ఞాన చక్షువుల్లో రేగిన జ్వాలల్లో

తపస్తప్తుడ నౌతాను.

*5-4-93*

# మనస్సాక ఊహల కూడలి

కదిలే ఆలోచనల్తో పాటు

కంకణం కట్టుకున్నట్టుగా కదుల్తాను

కర్మబద్ధుడనై

కర్తవ్యోన్ముఖుడనై చరిస్తాను

ఊహల పల్లకిలో

ఊరేగుతూ.....ఊరేగుతూ......

మనస్సులో మొలకెత్తే

మకరందోహాలకు

మలినా మలినం అవుతు

క్షణ క్షణం

నవ్యత్వానికి స్థానం కల్పిస్తూ–

మునుముందుకు నడుస్తాను.

*6–4-93*

# కెరటం హోరు

జీవిత సోపానాల్లో.............

మెట్టు మెట్టుకీ

అష్టకష్టాలనెదుర్కుంటూ

అప ప్రథలకు చెమర్చుతూ

అరపూటైనా.............

అర్థవంతంగా బతుకవచ్చనీ.............

అమ్మా, నాన్న విముఖతచూపినా.............

ఆదర్శం అంటూ.............

అందరికీ కాకున్నా, కొందరికైనా

అండగా నిలువ వచ్చనే ధ్యేయంతో

జీవనసాఫల్యం కొరకు

హోంగార్డైనా, పోలీసైనా, నర్సైనా.............

హ్లాదంగా ఎన్నుకున్నాను

స్త్రీకి.............ఎక్కడైనా

అరక్షణేనని తెలుసుకొని

మనుగడకు

మళ్లీ.............మళ్ళీ పోరాడుతున్నాను.

*17-11-93*

# జీవన జలధి

సన్నజాజాలూ
సంపెంగలూ
మల్లెలు,మరువం కలిసిన చోట
నవ్యరాగ స్నిగ్ధత
అనురాగపు కేదారాల్లో
కబుర్ల రవళుల్లో
పరవశగాన తప్తుల
హృదయ క్షేత్రాల్లో
పండిన అరుణ కాంతులు.

*29-10-94*

# కిత్తు

విచ్చుకుంటున్న రెక్కలపై
పెనుపరుగులసవ్వడి
మొలుస్తున్న మొలకలపై
మహిషం పాదాల శబ్దం
హృదయంలో పరిమళిస్తున్న భావాలపై
విషం చిలకరిస్తున్న ధ్వని.
నిరంతరం వెంటాడుతుంటే
అంతరంగం వడ సెగయై
కఠోర ఝుంఝుం మారుతంలా
నా హృదయంలో హిమజ్వాలయై ధ్వనిస్తున్నది.

కిత్తు= అగ్గి, నిప్పు

*1988*

# జ్ఞాపకాల క్షిపణులు......!

క్షత గాత్రుల జీవితంలోని
జ్ఞాపకాల క్షిపణుల్లా
నాగుండెలోతుల్లో
ప్రేయసి పదిలపరచిన తలపులు
నిత్యం ధ్వనిస్తున్నాయి.
తనను తాను పరిశీలించుకొమ్మంటున్నాయి
జీవితానికి ఆలంబనం
చేసుకొమ్మంటున్నాయి.

*1988*

# పొదుపురేఖ

జీవన కదన రంగంలో
నీవు వేసే ప్రతి అంగలో–
జీవన వ్యయసూచికలో–
ప్రతిక్షణాన్ని పొదుపుగా వాడుకో–
అప్పుడే.....
రేపటి ఆశారేఖ
ఇంద్ర ధనస్సై ముంగిట వాలుతుంది.

**5–8–89**

పొదుపు సమాచార్ పత్రిక

# ఉద్యోగం

జీవనగమనంలో

పయనించే పథికుడి పై

ఆకాశ మార్గం నుండి

పడే రాళ్ళెన్నో............

ఉద్యోగి - సద్యోగంలో

స్థాన చలనానికి

అడుగడుగునా ఆదేశాలే........

ప్రతి క్షణం ప్రతి బంధకాలే..........

*1988*

# ....పెరుమాళ్ళ కెరుక !

వెన్నెల కొండపై
వేలవేల కోరికల
ఒత్తిడిని తట్టుకుంటూ
కానుకలను
కామితం తీర సమర్పించబోతే
కాంతల మాంగల్యాలు
కాంక్షతో దత్తం చేసుకునే
కాముకులనైజం
భక్తులకు, దైవంకే తెల్సు.

*1990*

# ఆమని కోయిల

మధుర మధుర ఊహలతో
ముగ్ధ మనోహరంగా
తను వెలుగై
వెలుగును పదుగురికి పంచాలనే
చిగుళ్ళతో ఏ తెంచిన ఆమని మొదలంటా.....
ఆహుతైపోతే
ఆమని కోయిల
రవళిని వినగలమా !

*1990*

# కంకణం

జాతి జీవన దీపకళికను
చుట్టుముట్టిన కీటకాలు
జాత్యంహంకార నేపథ్యంలో
కబళించ చూస్తున్నాయి
ఐక్యతా ఉద్దీప్తితో
సమిష్టి చైతన్యం కొరకు
ఎద ఎదల్లో జాతీయత నింపి
పురోగమింపచేద్దాం రండి.

*1990*

# చాచాజీ

విశ్వమానవాళి శ్రేయస్సుకు
రాగరంజిత శాంతికపోతమై
నీ చొక్కా పై ధరించిన గులాబీని
నీ ప్రతిబింబంగా భావిస్తున్నాం
అయినా....................
నీగురించి ఈ తరానికి చెప్పే నాధుడేడి
నీ అడుగు జాడల్లో నడిచేవాడేడి
నీ ఆశయాలకు ఊపిరిపోసే నిస్వార్థులెవరు,
ఈనాడు
మా హృదయంలో నీ ఛాయాబింబాన్ని–
మా కంఠంలో నీ దీక్షను ప్రతి బింబించనివ్వు
"భారత్ ఏక్‌తా" కు ఒకే త్రాటిపై నడవడానికి
మాకుశక్తి నివ్వు చాచాజీ......................
విశ్వ శాంతి స్వేచ్ఛా పావురాలు
వినువీధిలో స్వచ్ఛందంగా విహరించడానికి
విమల మతులు అయి ప్రవర్తించడానికి
అవకాశం కల్పించు.

*1989*

# ముచ్చటగా మూడు.....!

నాకు మూడు
నిధులున్నాయి.
ఒకటి సాహిత్యం
ఇంకొకటి సహృదయం
మరొకటి దారిద్ర్యం
అంతేకాదు............
మూడు విధులున్నాయవి–
సాహిత్య సృజన
సహృదయాన్ని పంచడం
దారిద్ర్యంతో నిత్య సమరం

*24–2–91*

# అమరుడు

మాటలు ఎప్పుడూ
మామూలుగానే ఉంటాయి
మాత్సర్యాన్ని, మాంద్యాన్ని కల్పిస్తాయి.
మాటలు చేయని పనులు
చేతలు చేస్తుంటాయి
చేవను కల్పిస్తాయి
చిరస్థాయిగా ఉంటాయి
యాభైయ్యేరు మాటలు చెప్పి
మభ్యపెట్టడం అనేది తెలియక
యాభైయ్యేరు లంఖణాలు చేసి
యావజ్జీవితాన్ని ధారపోసి..........
అమరుడై—
ఆంధ్రావతరణకు మూలస్తంభమైన
నీకు మా జోహార్లు.

*1–11–93*

కీ॥శే॥ పొట్టి శ్రీరాములు గారి స్మృతికి

# మోదుగుపూల గలగలలు..........

ఉదయించే ఆశాకిరణాలకు
ఉవ్వెత్తున లేచే కెరటాలకు
ఉద్విగ్నమవుతున్న మనస్సులకు
ఉదీయమాన జిహ్వాలకు
వుదాత్తంగా
హృద్యంగా
సమవీక్షణంతో
అక్షరలక్షల నందించి
ఆలోచనా కేదారాలకు జీవంపోసిన
మీ భావఝురులు
మార్గదర్శకం....
మీ సాదా సీదా మూర్తిమత్వానికి
మా మోదుగుపూల నీరాజనం

*10–11–93*

డెబ్బదికోట్ల ప్రజానీకానికి
ఈ జాతి సమగ్ర భావానికి
సమిష్టి చైతన్యానికి
నేను ప్రతీకను.
అయినా అణువంతవాణ్ణి
అసలే కనరానివాణ్ణి
నా దేశ పౌరుల మనసు
కొద్దోగొప్పో ఎరుగుదును
గతమే జీవన మనుకునే,
వర్తమానమే వలదనే...............
సోమరులను జాగృతం చేస్తాను.
నా భావనలను హిమాలయాల ధవళ కాంతుల్లాగా
వెదజల్లుతాను.
స్నేహం నీడనిచ్చే చెట్టు లాంటిదని
నిరూపిస్తాను.
సరిహద్దురేఖల్లోని
త్యాగాలరుధిరాన్ని
ఈ జాతికి ఎరుక పరుస్తాను
చైతన్యం కల్పిస్తాను

ఈసును వదిలిస్తాను,

నేత్ర సంపుటిని............

కరసంపుటిని.......మమేకంచేసి

ఆత్మతో, ఆత్మను అనుసంధింపచేసి

నవజీవన రాగానికి కొత్త పల్లవి అందిస్తాను.

మానవతామూర్తినై

ఈ పురాతన పుణ్య వసుంధరకు

ఐక్యతాగీతమాలికను బహుకరిస్తాను

గుండె గుండెలో దివ్వెలను వెలిగిస్తాను

కార్తీక దీపకాంతులను ఎద ఎదలో పండిస్తాను

అయినా అణువంతవాణ్ణి

అసలే కనరాని వాణ్ణి

నేను నిత్య నూతనత్వాన్ని కాంక్షించే తేజస్విని

ద్వేశాల, రోషాల, దోషాలతో నిషా ఎక్కిన ప్రజకు

చైతన్య రేఖనై ప్రభవిస్తాను

ఈ జాతి మానవతకు ప్రతిబింబాన్నై నిలుస్తాను.

*26–1–95*

*AIR Wgl, 1-3-95*

# కుదించుకుంటున్న పండుగలు

వర్తమానం

వంకరలు.....

వంకరలుగా తిరుగుతూ

వెక్కిరిస్తున్నట్టుగా సాగుతుంది.

మధ్య తరగతి జీవనంలో

నిత్యం కనపడే

ఎగుడుదిగుళ్ళకు సమాంతరంగా-

ఎగిసిపోతున్నది నింగికి,

జీవన ప్రమాణాలకు

ఆర్థిక సంయోజనాలకు

అందీ అందక-

అతలాకుతలం చేస్తున్న సమయాలలో

పర తంత్రులను చేసే

పర్వదినాలు.....

... ... ... ... ... ...

పర్వదినాలు

ప్రజలముఖాలపై

విరబూసిన కత్తుల్లై

నవ్వేములుకులై

ఆనందాన్ని కుదించుకోమంటున్నాయి
ఆర్థికమాంద్యం
అనవరతం హెచ్చరిస్తున్న వేళ
అయోమయం....అంతా గందరగోళం
ఆధారపడ్డ ప్రాణాలను
బుజ్జగిస్తూ, చెమ్మరిల్లిన కళ్ళను
చెంగులతో, దస్తీలతో ఒత్తుకుంటూ
మధ్యతరగతి మందహాసంలో
కుదించుకుంటున్నాయి పండుగలు.

*25–1–95*
*AIR, Wgl, 12-6-95*

అర్థవంతమైన స్వచ్ఛతతో
అనురాగాన్ని రంగరించి
ఆప్యాయతలో పునీతులను చేసి
తన కష్టాన్ని, ఇబ్బందులను
తనలోనే ఇముడ్చుకొని
మాతృత్వపు కెరటంతో
నిండారుగా పలకరించిన
నిర్మల హృదయం ఏదీనాడు ...?
పదేళ్ళ బాల్యంలో
పదిలపరచిన ఆమె ఆత్మీయత...............
జీవన ప్రయాణం
జీ భూతాలం అయి చరిస్తూ...............చరిస్తూ.........
జీవన సహకార రంగంలో
మళ్ళీ మొదటి కొచ్చిన పరిచయం
ఆ "అమ్మ".
ఆ "అమ్మ" పేరు విన్నప్పుడల్లా
భావనాఝురినై తన జ్ఞాపకాల్లోకి ప్రవహిస్తాను.
అమ్మ ఎవరో కాదు..........
నా పేగుకు మాతృక మాత్రం కాదు..............
నా గుండెల్లో కూర్చున్న "అన్నపూర్ణ"

మా అమ్మ "తాయార్లైతే....................."

ఆ అమ్మ "లక్ష్మి నరసమ్మ........."

ఇంకో అమ్మ "గంగా భవానీ........."

ముగ్గురమ్మల మూలపుటమ్మలకు

కృతజ్ఞతలు చెప్పలేను........

కృతజ్ఞతల కందని భావనది..........

కొసరి కొసరి తినిపించే హృదయం

కొలమానం ఎంతని చెప్పగలను

అది మేరు నగధీరం

అది దివ్య వరం.

"బేటా......" నీకు భయమెందుకురా.......

"చాయ్...." అయితే తాగు అన్న "గంగా భవాని"

సౌజన్యంముందు వెలవెలబోయిన

నా సౌగంధ వీచిక ఎంత?

బాబూ.....ముందుగా ఈ అన్నం తిను.....

ఈ కూర కలుపుకో......

నన్ను జ్ఞాపకాల్లో నిలుపుకొని?

* అంజలిని, నన్ను చూడడానికి వచ్చినావా !

అందుకనే వాడికి అందుకున్నంతగా

అనురాగ కేదారాలను

పండించిన ఆ తల్లి 'లక్ష్మి నరసమ్మ"

పల్లెరసార్ద్రత ముందు

పరిణతి చెందని నేను ఎంత?

---

*లక్ష్మినరసమ్మగారి కూతురు

నిత్యం.........నన్ను గమనిస్తూ
నిగర్వి అయి
చీదరలను, దూషణ తిరస్కారాలను
కోపతాపాలను సమతుల్యంగా...
'భూదేవి' అయి
నిరంతరం కన్నపేగు
అజేయుడు కావాలనే కాంక్షలో
తల్లడిల్లుతున్న మా అమ్మ 'తాయారు'
అనురాగాల ముందు
ఆప్యాయతలో నా ఉనికి ఎంత?
అమ్మ ఆత్మీయత అనుభవైకవేద్యం
"అమ్మ..."భావన అజరామరం
అది మాతృత్వం అందించేదే కానక్కర్లేదు
అది నా నరనరాల్లో పాతుకుపోయిన
ఏ సౌజన్య దేవతైనా కావచ్చు.
'మంగతాయారు' కావచ్చు.
'భారత భారతి' కావచ్చు.
నా మాతృమూర్తులకు ప్రతీకలు మాత్రం
తాయారు, లక్ష్మి నరసమ్మ, గంగాభవానీలు........
అందరికీ అంజలి తప్ప ఏమిచ్చుకోగలను.

*23–5–95*

# మయసభ

కార్యాలయం–

ఒక మాయామోహిత మయసభ

అది అమీబాను పోలి ఉంటుంది

అది అరమరికలు లేకుండా విచ్చుకుంటుంది

అక్కడ ప్రతి వాడూ కాగితపు పులే........

కాగితాలను ఆరగించేవాడే

కామితాలను, కార్యార్థంతో

కాకాలతో సాధించే వాడే

ఆ మయ సభలో

ప్రతివాడూ ధృతరాష్ట్ర సంప్రదాయాలకు

ప్రతికూల వారసుడు.

ఇక్కడ–

ధర్మరాజులు, లాల్‌బహదూర్‌లు

అధర్మవీరులు

కార్యాలయబేతాళంలో

సామాన్యుడు పని సాధించుకోవడం

మయసభ నుండి భద్రంగా బయట పడ్డట్టు

పద్మవ్యూహం నుండి పదిలంగా జారిపడ్డట్టు................

*29–5–95*

# నిర్జీవ చిత్రం

జీవనం స్తబ్ధతగా
సాగుతున్నట్టు అనిపిస్తుంది
నా ప్రయాణాలలో........
అది ఎప్పుడూ యాంత్రికమే !
యాంత్రిక ప్రయాణంలో
నిశ్చలత నుండి వచ్చే మార్పును
ఆహ్వానించినా
జీవనంలో నిస్తబ్దత
క్రొత్త మార్పుని వ్యతిరేకిస్తుంది
అది సహజమైన నిర్లిప్తత
అది ఒక సోమరితనం
అది ఒక అచైతన్యం
అది నిర్జీవ లక్షణంలో ఒక అంశం.
మానవుని చైతన్యంలో
ముకుళించుకొని పోతున్న అంశానికి
ప్రతీక మార్పుకు విముఖత
మానవుని ఆలోచనల మార్పుకు
మార్గం మూసి వేయడం.
ఈనాటి జీవనం

కేవలం విచ్చలవిడితనం
అయాచిత సుఖ భోగం
అధికార.......దాహం
ఏ మాత్రం
ఆయాసం లేకుండా
ఆబగా అనుభవించే జీవన విధానం
సుఖ లాలసత.

*29–5–95*

# మధ్య తరగతి మందహాసం

ఈ నిట్టూర్పులు, చికాకులు
జీవనంలో ఎప్పుడూ ఉండేవే....
జీవన ప్రయాణంలో పయనించడానికి
మార్గం ఎంచుకున్నప్పుడు
రాళ్ళు, రప్పల నుంచి తప్పుకోవడం తప్పనిసరి
ఒక్కొక్కసారి మన కదలిక
జీవంలేని నవ్వులాగా–
ఆలంబనంలేని మల్లె తీగలాగా–
గాలితీసేసిన బంతి లాగా–
అన్పిస్తుంది.
నీరసమైన కదలికకు కూడా
అప్పుడప్పుడు హాసోన్ముఖము జత అయి
నిలదీస్తుంది.
జీవనంలో ఒక్కసారిగా వచ్చిన చలనం
ప్రశాంతంగా ఉన్న నీళ్ళలో రాయిపడినప్పటి
ప్రకంపనలా ఊరేగుతుంటుంది.
ఊరేగింపులోని ఒత్తిడులు
బహిరంగసభలకు సమకూర్చిన జనం
రణగొణ ధ్వనుల్లా విస్ఫోటిస్తున్నాయి.

మధ్యతరగతి మందహాసంలో

రణగొణులు ఎప్పుడూ సినిమాల్లోని

హాస్యపాత్రల పాటలా సాగుతుంది.

అంతేకాదు అప్పుడప్పుడు

అవి నైరూప్య చిత్రాలు అవుతాయి.

లేదా............ ! ప్రహేళికలు అవుతాయి.

అందుకే సామాన్యుని నిట్టూర్పులు, నిస్పృహలు

జీవన యానంలో అప్పుడప్పుడు

స్పీడ్ బ్రేకర్‌లు, నీటికుంటలవుతాయి.

ఏమడ్డమొచ్చినా– –

జీవనాన్ని ఆదర్శంగాను–

చలివేంద్రంలోని తీర్థంలాగా–మలచుకోవడం

మధ్యతరగతి వాడికే తెలిసిన కళ.

8–9–95

18–9–95 AIR WGL

# నిద్రా దేవత

ఎప్పుడూ హుషారుగాను–
    నవనవంగాను–
నైట్ క్వీన్ సువాసన్లా అంటుకొని–
పిలిస్తే పలికే దైవమై
వటపత్ర శాయి కోడలిని
జీవనదాతల ఆలిని
కడచూపుకు కూడా నోచుకోకుండా
జ్యేష్టాకుమారికి అక్కలాగా
నిద్రాదేవత ఎప్పుడూ కరుణిస్తుంటుంది.
బస్సు ప్రయాణంలో ప్రక్కవాడిని కరుణించినప్పుడో
వాడు............నాకు............
బ్రేక్ డ్యాన్స్‌ను గుర్తుకు తెస్తుంది
షేక్ డ్యాన్స్‌ను గుర్తుకు తెస్తుంది.
అంతేకాదు....
నిద్రాదేవత
ఉల్లిపొరల పరదాల మాటున
నృత్యం చేసే నాట్యమయూరిలాగా
అమ్రపాలి కాలి అందియల రవళుల మధ్య
తేలియాడుతూ వచ్చి నట్టు అన్పిస్తుంది.

ఆమె తుషారపవనం

చౌరాసియా వేణుగానంలా చల్లబరుస్తుంది.

బాధా తప్తులను, ఆర్తులను

ఒడిలో ఓదార్చే వరం అవుతుంది.

సుఖ దుఃఖాలకు అతీతం నిద్ర

ఋజాగ్రస్తల నుండి సేదదీర్చి

మరునాటికి....

ఆశోపగతులను చేస్తుంది.

11–9–95

18–9–95 AIR WGL

# పరిచయం

నేను పయనించే మార్గంలో
పరిచయాన్ని ఎప్పుడూ పదిల పరుద్దామనే అనుకుంటాను.
పరిచయం ఒక్కొక్కప్పుడు
గులాబ్ జామ్ అవుతుంది–కలాకంద్ అవుతుంది.
పరిచయం ఒక్కొక్కప్పుడు
సంపెంగవుతుంది–గులాబి అవుతుంది.
పరిచయం ఒక్కొక్కప్పుడు
రాత్ కీ రాణి సువాసనవుతుంది–మల్లెపూల
పరిమళం అవుతుంది.
పరిచయం ఒక్కొక్కప్పుడు
కూనిరాగం అవుతుంది–మేఘమల్హారమవుతుంది.
పరిచయం నన్నెప్పుడు
కొత్తమార్గానికి పయనింపచేస్తుంది
ఉత్తేజితుణ్ణి చేస్తుంది.
పరిచయం ఇంద్రధనస్సై పలకరిస్తుంది
పరిచయం స్వచ్ఛతకు మారురూపై–
ఏకాకితనంలో సెలయేరవుతుంది
మార్దవం మిళితం చేసుకున్న
ఆనందకేతనం ఎగురవేస్తుంది
అందుకే ప్రతి పరిచయం ఒక్కో చెలిమ
అందుకున్నవాడికి అందుకున్నంత ఆత్మీయత

13–9–95

18–9–95 AIR WGL

**Nirantaram** - A freeverse Poetry by **Dr. T. Sriranga Swamy**, Warangal

*1995 సం॥పు స్వచ్ఛంద భాషా సేవ పురస్కారం - " సోమనాథ కళాపీఠం, పాలకుర్తి, వరంగల్లు*




డా॥ టి. శ్రీరంగస్వామి

బి.కామ్., ఎమ్.ఏ., పి.హెచ్.డి.

ఇం.నెం. 5-11-481, విద్యారణ్యపురి

హన్మకొండ, వరంగల్లు - 506 009


**ముద్రితాలు**

కవితా సంపుటాలు :

మధుర

శిఖరం

మానస సంచరరే......

వ్యాస గ్రంథాలు:

విపంచి

కోవెల సుప్రసన్నాచార్యవాఙ్మయ జీవిత సూచిక

దేవుల పల్లి రామానుజరావు - ఒక రేఖా చిత్రం

పరిశోధన

వరంగల్లు జిల్లా రచయితల వాఙ్మయ జీవిత సూచిక

విశ్వనాథ వారి కృష్ణ కావ్యాలు

త్వరలో:

వరంగల్ మార్గదర్శిక - వరంగల్ ప్రముఖ దేవాలయాలు




A Publication of Srilekha Sahithi, Warangal

1996 Rs. 10/-

Sri Shanthi printing Press, HNK. Ph: 79541